## నిజాం నవాబు అడియాస

### రామానందతీర్థగారి విమర్శ

సికిందరాబాదు, సెప్టెంబరు 8: ఆధ్యక్షుడు డాక్టరు రాజేంద్ర ప్రసాదుగారు హైదరాబాదుకు వచ్చినప్పుడు వారి గౌరవార్థమై యిచ్చినవిందు సందర్భంలో హైదరాబాదు రాజప్రముఖ్ నిజాముగారు వెల్లడించిన అడియాసలను గురించి సంస్థాన కాంగ్రెసు మాజీ అధ్యక్షులైన స్వామీ రామానంద తీర్థగారు ఇలా వ్యాఖ్యానించారు: "సంస్థాన విభజననుగురించి నిజాముగారివాదం నిలిచేదికాదు. అది కేవలమూ నవాబుగారి ముఖ్యయుగం నాటి మనఃప్రవృత్తినీ, ప్రజాస్వామికంలో విశ్వాసం లేమినీ మాత్రమే తెలియ జేస్తున్నది. జనరల్ ఎన్నికల తరువాత ప్రజా ప్రతినిధులు నిర్మింపబోయే ప్రభుత్వం స్థిరమయిందిగా వుండదన్న ఆయన వ్యంగ్యం నిజంగా శోచనీయం. ఇండియన్ రిపబ్లిక్ అధ్యక్షుని నామినీ మాత్రుడైనట్టి ఒక వ్యక్తి వెలిబుచ్చిన వ్యక్తిగత వాంఛను గురించి ప్రజలు ఎక్కువగా తాపత్రయ పడరాదు. వ్యక్తిగతమైన ఆ కోరిక ఈ ప్రజాస్వామిక యుగంలో నెరవేరేదికానే కాదు."

## బళ్లారి ఆంధ్ర జిల్లా కాంగ్రెస్ కార్యవర్గం

### అధ్యక్షుడుగా ఎస్. రామిరెడ్డిగారి గెలుపు

ఆదోని, సెప్టెంబరు 8: ఈ జిల్లా ఆంధ్ర కాంగ్రెసు సంఘమునకు ఎస్. రామిరెడ్డిగారు అధ్యక్షులుగా ఎన్నికైనారు. ఈ యెన్నికలు జిల్లా కాంగ్రెసు కార్యాలయంలో మొన్న మధ్యాహ్నం 3-30 గంటలకు, టి. జి. తిమ్మయ్యశెట్టిగారి అధ్యక్షతన యేర్పాటు చేయబడినవి. అధ్యక్షపదవికి మొదట వి. లోకిరెడ్డిగారి పేరును విరూపాక్షరెడ్డిగారు ప్రతిపాదించారు. కాని లోకిరెడ్డిగారు తమ అభ్యర్థిత్వాన్ని ఉపసంహరించుకొన్నారు. అనంతరం యస్. రామిరెడ్డిగారి పేరును ప్రతిపాదించగా సభవారు ఏకగ్రీవంగా వారిని అధ్యక్షపదవికి ఎన్నుకొన్నారు.

ఇదివరలో కార్యదర్శిగా ఉన్న హెచ్. వంకటేశ్వరరావుగారుకూడా ప్రధాన కార్యదర్శి పదవికి పోటీ లేకుండానే ఎన్నికైనారు. సహాయ కార్యదర్శి, కార్యవర్గ సభ్యులు ఎన్నికైనారు.

### నెల్లూరుజిల్లా కాంగ్రెసు సంఘం

నెల్లూరు, సెప్టెంబరు 4: జిల్లా కాంగ్రెస్ అధ్యక్షులు. ఏ. సి. సుబ్బారెడ్డిగారు యీ క్రిందివారిని కార్యవర్గ సభ్యులుగా నియమించారు.

తూమాటి వెంకటప్పనాయుడుగారు ఉపాధ్యక్షులు, మన్నెంపల్లి హనుమంతరావుగారు-ప్రధాన కార్యదర్శి, మిట్టపల్లి రాధాకృష్ణయ్య, వల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డి-సంయుక్త కార్యదర్శులు రావు వెంకటసుబ్బయ్య, బేమిరెడ్డి అయ్యపరెడ్డి, కోరాబత్తిన చిన్నయ్య యింటూరు వెంకటయ్య యస్. బాలకృష్ణారెడ్డి, యస్. ముస్తాక్, కోటాకి రుక్మిణమ్మ, పరుచూరు సుబ్రహ్మణ్యం సువపాటి రాజగోపాలు మాకినేని వర సయ్య తుమ్మలచర్ల రంగయ్య గుజ్జల పూడి వెంకటసుబ్బానాయుడు సంది రెడ్డి శేషయ్య యన్. మహాదేవశర్మ ఐ. వెంకటేశ్వర్లుగార్లు- కార్యవర్గ సభ్యులు.

### శ్రీకాకుళంజిల్లా కాంగ్రెసు కార్యవర్గ ఎన్నిక

శ్రీకాకుళం, సెప్టెంబరు 5: 3వ తేదీన యీ జిల్లా కాంగ్రెసు అధ్యక్షుడుగా ఎన్నికైన తమ్మినేని పాపారావుగారు దిగువ కార్యవర్గాన్ని నిర్మించారు.

ఉపాధ్యక్షుడుగా పెద్దింటి రామస్వామి; కొప్పుశెట్టి రామమూర్తిగార్లు ప్రధాన కార్యదర్శి కోటగిరి సీతారామస్వామిగారు. కార్యవర్గ సభ్యులు బాలకజగ్గారావు, కొరియమాగు కామేశ్వరరావు, కొరకల నూర్య నారాయణ, వద్ది విశ్వనాధ రావు, పెన్నెల రామచంద్ర రావు, తెర్రబప్పయ్య, బొటన్నాగు స్వామిబాబు, అవిక్కి వెంకటకృష్ణ హనుమంతి రావు, సువారి సన్యాసి అప్పారావు, పన్నింటి రాజనాయుడు, పైడి నరసింహాప్పారావు, పాలవలస సంఘం నాయుడు, పొరుల కున్నయ్య, దాకోటి అప్పలస్వామి, లుకలాపు లక్ష్మణదాసు గార్లు. ఇవ్వని కార్యవర్గాల నియామకము జరుగలేదు స్వ. వి.

### తూ. గోదావరిజిల్లా కాంగ్రెసు అధ్యక్షుడు

కాకినాడ, సెప్టెంబరు 8: తూర్పు గోదావరిజిల్లా కాంగ్రెసు అధ్యక్షుడుగా ఎం. పల్లంరాజుగారు, కార్యదర్శిగా ఎల్. వి. చౌదరి, సహాయ కార్యదర్శిగా టి. వీరాస్వామిగార్లు ఎన్నికైనారు.

### పిడుగుపడి ఒకనిమరణం

కృష్ణాపురం, సెప్టెంబరు 4: నిన్న వరం తాలూకా కుగ్గలలంక గ్రామంలో నిన్న ప్రసిద్ధం ఓకనున్న కోరుంగా ... పిడుగుపడి ... కొంత పడిపోయిన ... కొంచెం ... స్పృహలేక్కి పడిపోయాడు. కాని కొద్దిసేపటిలో తేరుకొన్నాడు.

## ఎన్నికలలో వెనుకబడ్డ జాతులకు ప్రాతినిధ్యం

### ప్రదేశ్ కాంగ్రెసుకు రాష్ట్ర వ్యవసాయకూలీ యూనియన్ విజ్ఞప్తి

(స్వకీయ విలేఖరి)

విజయవాడ, సెప్టెంబరు 8:— మద్రాసు ప్రభుత్వంవారు నియమించిన వ్యవసాయ సంస్కరణల సంఘం వారి సిఫారసులు పేదలకు ఏ విధంగాను ఉపకరించవు; ఆ సిఫారసులను అమలు చేయరాదు, అని ఇక్కడ ఆంధ్ర రాష్ట్ర వ్యవసాయ కూలీసంఘ కార్యవర్గ సమావేశానికి అధ్యక్షత వహిస్తూ వేముల కూర్మయ్యగారు అన్నారు.

ఇదే సందర్భంలో హరిజన సేవక కార్యవర్గం, రాష్ట్ర వెనుకబడ్డ జాతుల కార్యవర్గసమావేశాలుకూడా జరిగాయి.

ప్రతి జిల్లాలో వ్యవసాయ కూలీ కార్యాచరణ సంఘాల్ని నియమించటానికి కూర్మయ్యగారికి అధికారమిస్తూ తీర్మానించారు. ఈ సంఘాలన్నింటి అభిప్రాయాల్ని సేకరించి రాబోయే ఎన్నికలకు నిలబెట్టవలసినఅభ్యర్థులను ఏరి, వారి పేర్లను రాష్ట్ర వ్యవసాయ కూలీ కార్యవర్గామోదంతో రాష్ట్ర కాంగ్రెసు వారికి సమర్పించాలని కూడా కూర్మయ్యగారిని కోరారు. రాష్ట్ర కాంగ్రెసు వారు వ్యవసాయ కూలీలకు, వెనుకబడ్డ జాతులవారికి ఉచిత ప్రాతినిధ్యమివ్వాలని కోరుతూ తీర్మానించారు. కూర్మయ్యగారిని ప్రదేశ్ కాంగ్రెసు కార్యవర్గంలోకి తీసుకోవాలని, ప్రతిజిల్లాకు ఒక స్త్రీప్రతిని, ఇద్దరు వెనుకబడ్డ జాతులవారిని, ఒక ముస్లిమును - గుంటూరు జిల్లాలో 4 గురు స్త్రీప్రతులను కాంగ్రెసు అభ్యర్థులుగా తీసుకోవాలని ప్రజాకాంగ్రెసు అధ్యక్షుడ్ని కోరుతూ తీర్మానించారు.

తదుపరి వ్యవసాయకూలీ, హరిజన సేవకులు, వెనుకబడ్డ జాతుల సంఘాల కార్యవర్గాల సంయుక్త సమావేశం తులాబందుల నాగేశ్వరరావుగారి అధ్యక్షత క్రింద జరిగింది. కాంగ్రెసునుబలపర్చాలని వివిధ ఉపన్యాసకులు విజ్ఞప్తి చేశారు. ప్రధానమంత్రి జవహర్లాల్ నెహ్రూ నాయకత్వంపై విశ్వాసం ప్రకటిస్తూ తీర్మానాలు చేశారు.

ఈ సమావేశాలకు శ్రీయుతులు వి. సి. శేషరావు, వక్కా చినవెంకయ్య, నరేంద్రుని వెంకటసుబ్బయ్య, యన్. కోటేష్, జాలా మంగమ్మ, వంబూరి శ్రీనివాసరావు ఇంకా అనేకులు వచ్చారు.

## నూజివీడు తాలూకా ఆహారస్థితి

### పట్టణ కాంగ్రెసు అధ్యక్షుని ప్రకటన

నూజవీడు, సెప్టెంబరు 8: ఈ తాలూకాలో ఆహారపరిస్థితి చాలా ఆందోళనకరంగా ఉన్నదని తెలుపుతూ పట్టణకాంగ్రెసు అధ్యక్షుడు పి. గోపాలస్వామిగారు యీ ప్రకటన చేస్తున్నారు:

"ఈ తాలూకాలో తగినంతగా ఆహార ధాన్యాలు లభించనందున, ప్రజలు వారానికి మూడురోజులు పస్తులుంటున్నారు. చౌక ధాన్యం దుకాణాలద్వారా ప్రజలకు సరఫరా చేస్తున్న బియ్యం, జొన్నలు మట్టి, రాళ్లతో నిండి ఉంటున్నాయి. ప్రజలను యీ క్షుద్బాధనుండి కాపాడడానికి ప్రభుత్వం వెంటనే యీ తాలూకాకు ధాన్యం సరఫరా చేయాలి." (పి. టి. ఐ.)

### 1½ బొన్నుల రేషను

నర్సారావుపేట, సెప్టెంబరు 4: ఈ పట్టణంలో యిటీవల మనిషికి 1½ బొన్నుల బియ్యం చొ॥న రేషన్ యిచ్చారు. ప్రజలు చాలా అసంతృప్తులైవున్నారు. (స్వ. వి.)

### ముస్లిం యువతి ఆత్మహత్య

నర్సారావుపేట, సెప్టెంబరు 4: ఈ పట్టణంలో రామిరెడ్డిపేటలో ఒక యింటిలోనున్న హుసేన్‌బీ (30) అనే ముస్లిం యువతి వురిపోసుకొని ఆత్మహత్య చేసుకొన్నది. శవపరీక్ష చేసిన పంచాయతీదార్లు యీమెకు కొంత కాలంగావున్న కడుపునొప్పి బాధ భరించలేక ఆత్మహత్య చేసుకొన్నట్లు నామాస్తులం యిచ్చారు. (స్వ. వి.)

### అనకాపల్లిలో కమ్యూనిస్టు అరెస్టు

అనకాపల్లి, సెప్టెంబరు 8: రెండేండ్లుగా వారంటుకు దొరకకుండా తిరుగుతున్న మైనేని నారాయణమూర్తి అనే కమ్యూనిస్టును యీ పట్టణ పోలీసులు పట్టుకొని అరెస్టుచేశారు. (స్వ. వి.)

### జగ్గయ్యపేట పంచాయతీకోర్టు అధ్యక్షుని ఎన్నిక

జగ్గయ్యపేట, సెప్టెంబరు 7: నేడు జరిగిన ఎన్నికలో పంచాయతీకోర్టు అధ్యక్షుడుగా గోనుగుంట్ల నాగేశ్వరరావు, ఉపాధ్యక్షుడుగా సంకేపల్లి రాజరత్నంగార్లు ఏకగ్రీవంగా ఎన్నికైనారు.

### ఆహార పరిశోధన కేంద్రం

మదరాసు, సెప్టెంబరు 8: ఆహార పరిశోధన కేంద్రాన్ని కూనూరునుంచి ... హైదరాబాద్‌కో మార్చవలెనని ఉంచేయాలా ప్రభుత్వంవారు ఆలోచిస్తూ వున్నారు.

శ్రీ వి. కె. ఉపద్రష్ట, బి. ఎ. యల్. యల్. బి. యస్. సి. ఎ. ఎ. యస్. ఎ. ఎ. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో కామర్సు లీడరుగా పని చేస్తున్నారు. వీరు మద్రాసు సేల్సు టాక్సు ట్రిబ్యునల్ సభ్యునిగా నియమింపబడినారు.

## మద్యనిషేధం ఆర్థిక ప్రయోజనాల విచారణ

### మదరాసు కౌన్సిల్ ప్రశ్నోత్తరాలు

మదరాసు, సెప్టెంబరు 7: మదరాసు కౌన్సిలు సభ యీవాళ శ్రీ జె. బి. రామకృష్ణరాజుగారి అధ్యక్షతను సమావేశమైంది. ప్రశ్నోత్తరాల సమయంలో శ్రీ సూర్యనారాయణగారి ప్రశ్నకు సమాధానంగా మదరాసులోను పట్టణ గ్రామ ప్రాంతాలలోను మద్యనిషేధం ఆర్థిక సాంఘిక ఫలితాలుగూర్చి విచారణపూర్తి అయిందని సభానాయకుడు తెలిపాడు. గ్రామాలందు 6814 కుటుంబాలయు, పట్టణాలలో 1049 కుటుంబాలయు, మదరాసు నగరమున 500 కుటుంబాలయు జీవన వ్యవయములు లెక్కలు సేకరించి పరిశీలించడమైనది. వాటివల్ల నిరూపణ అయ్యేఅంశములనివేదిక సెప్టెంబరు ఆఖరులోగా సిద్ధం కావచ్చునని ఎంచబడుతోందని కూడా వారు తెలిపారు.

### ఎన్నికల అభ్యర్థులకు కాగితం నష్టంయి

జనరలు ఎన్నికల ప్రచారానికిగాని స్థానిక సంస్థల ఎన్నికల ప్రచారానికిగాని అభ్యర్థులకు కావలసిన కాగితము సప్లయి చేయటానికి ప్రభుత్వంవారు తమవద్ద కాగితము నిలవనుంచుకొనలేదని శ్రీ సూర్యనారాయణరావుగారు అడిగినప్రశ్నకు సభానాయకుడు బదులు చెప్పారు.

### గోర్వాలా కమిటీ నివేదిక

పరిపాలనా వ్యవహారాలుగూర్చి శ్రీ గోర్వాలాగారు గావించిన సిఫార్సులు గలనివేదిక ఇండియా ప్రభుత్వమునుండి ఈ ప్రభుత్వానికి అందియున్నదని ఆ సిఫార్సుల విషయమై ప్రభుత్వంఆలోచిస్తున్నదని శ్రీ భీమారావుగారి ప్రశ్నకు సమాధానంగా మంత్రి డా॥ రాజన్ గారు చెప్పారు.

### కాన్సర్ చికిత్స

మదరాసు, సెప్టెంబర్ 8: పుట్టకురుపు చికిత్సకు రాడాన్ విత్తులకంటె రేడియంసూదులు మంచివని ప్రభుత్వం వారు నిశ్చయించారు.

రేడియంసూదులు మంచివా? లేక రాడాన్ విత్తులుమంచివా అని తేల్చుటకు ప్రభుత్వం ఒక ప్రవీణులసంఘాన్ని నియమించింది. సదరు సంఘం వారు యీ విషయాన్ని సమగ్రంగా పరిశీలించి రాడాన్ విత్తులకన్న రేడియం సూదులు పుట్టకురుపు చికిత్సకు బాగా పనికివస్తాయని అభిప్రాయమిచ్చారు.

రైల్వేల మంత్రివర్గంవారి ఆహ్వానంపై మదరాసు న్యాయవాది శ్రీ ఎస్. రామస్వామిఅయ్యర్ భారత రైల్వేలలో టికెటుపనులను పరిశీలించి సంస్కరించుటకు అంగీకరించారు.

గుంటూరు మురుగుబాధిత రైతుల సమావేశమును, జిల్లా రైతుకాంగ్రెసు కార్యనిర్వాహకవర్గ సభ్యుల సమావేశమును ఈ 10-వ తేదీ సోమవారం సాయంత్రం బందరులో కృష్ణాజిల్లా బోర్డు కాంగ్రెసుపార్టీ ఆఫీసు భవనమునందు జరుగును.

### అక్టోబరు 10న 3వేలకు పైగా యినాం ఎస్టేట్లు స్వాధీనం

మద్రాసు, సెప్టెంబరు 7: ఇనాం దారీ రద్దు చట్టాన్ని అనుసరించి మద్రాసు ప్రభుత్వంవారు 3 వేలకు పైగా యినాం ఎస్టేట్లను స్వాధీనపరచుకోవటానికి నిశ్చయించింది. దీనికి సంబంధించిన ప్రభుత్వ ప్రకటన సేడు సెలవులో ఫోర్టు సెంట్ జార్జి గజెట్‌లో ప్రకటితమౌతున్నది. ఎస్టేట్లను అక్టోబరు 1న స్వాధీన పరుచుకొంటారు. ఇదివరకే సెటిల్మెంట్ ఆఫీసరులు పరిష్కారం చేసినవీ, అందుపై ట్రిబ్యునల్‌కు అప్పీలు చేయబడినవీ, దాఖలైన అప్పీళ్లను ట్రిబ్యునల్ పరిష్కరించినవీ ఎస్టేట్లు ప్రభుత్వంవారు స్వాధీనం చేసుకోబోతున్నవి.

### సంగీత కచ్చేరీలపై వినోదాలపన్ను

సంగీతనృత్య ప్రదర్శనములమీద వినోదాల పన్ను మినహాయించే విషయం ప్రభుత్వం ఆలోచించాలని ఆర్థికమంత్రి శ్రీ టి. గోపాలరెడ్డిగారు ఇటీవల జగన్నాథ భక్తసభలో ప్రసంగిస్తూ చెప్పారు.

## సహకారోద్యమ సర్వతోముఖాభ్యుదయం

### చంద్రమౌళిగారి వివరణ

మద్రాసు, సెప్టెంబరు 8: "సహకారఉద్యమం ఈ రాష్ట్రానికి 40 ఏండ్లుగా చాలా శ్రేయస్సు చేసింది. సంఘానికి ప్రయోజనకరమైన అనేకమైన నూత్నరంగాల్లో ఈ ఉద్యమం సర్వతోముఖంగా వికసిస్తోంది" అని మద్రాసు ప్రభుత్వ స్థానికశాఖామాత్యులు కల్లూరి చంద్రమౌళిగారు నేడు పత్రికా ప్రతినిధుల సమావేశంలో చెప్పారు. అభివృద్ధిశాఖా కార్యదర్శిలోబో ప్రభు, సహకారశాఖ రిజిష్ట్రారు రయిన్‌గారలు హాజరై ఉన్నారు.

చంద్రమౌళిగారు ఇల్లా చెప్పారు:- "చెన్నరాష్ట్రంలో అన్నిరకాల సహకారసంఘాలు 20 వేలు ఉన్నాయి. అందులో 16 వేలు వ్యవసాయ పరపతిసంఘాలు. అందులో 10633 సకలార్థ సహకారసంఘాలు. ఈ రాష్ట్రంలోని సహకారఘాలను సకలార్థ సహకార సంఘాలుగా చెయ్యాలం ప్రభుత్వ సంకల్పం. ఈ ఏడాది మరో రెండువేలు సకలార్థ సహకార సంఘాలుగా మారవచ్చు. సాలుకు రూ. 72 కోట్లవరకు సహకార సంఘాలద్వారా వ్యాపారం జరుగుతోంది. మన ప్రభుత్వ ఆదాయం కన్న హెచ్చుధనం ఈ సంస్థలద్వారా నడుస్తోంది. ప్రపంచ మంరేటిలో గూడా ఇక్కడ ఈ ఉద్యమం పెద్దదంటే అతిశయోక్తి గాదు."

"సకలార్థ సహకార ప్రణాళిక క్రింద సెంట్రల్ బ్యాంకులకు సబ్సిడీలకు రూ 2,18,124 లు ఇవ్వబడింది. వ్యవసాయ ప్రణాళిక అమలు జరుగుతోంది. భూమిసాగు సంఘాల క్రింద, 11 వేల ఎకరాలకుపైన, వ్యక్తులకు 8 వేల ఎకరాలు ఇవ్వబడినవి. భూమిలేని కూలీలు, మాజీ సైనికులు యీ సంఘాల్లో సభ్యులు. మొదటిరకపు సంఘాలు 27 వరకూ వున్నయి. రెండోతరగతి సంఘాలు 20 వరకువున్నాయి." వీరికి విత్తులు ఎరువులు, కొంతడబ్బూ వ్యవసాయం నిమిత్తం ఋణంగా ఇవ్వబడుతుంది.

జిల్లాల్లో భూములుగలవారు. సాగు చేయదగిన భూమిని బంజరుగావడ వేసి ఉంచితే 1949 భూమి ఉపయోగపు ఉత్తర్వుక్రింద ప్రభుత్వంవారు యజమానులకు నోటీసుయిచ్చి, ప్రభుత్వం దాన్ని వశంచేసుకొని సహకార సంఘాలకు ఇస్తారు. ఈ ప్రణాళికను ప్రభుత్వంవారు ఆలోచిస్తున్నారు.

ఈ సాలుకు మరో ఆరుభూమిసాగు సంఘాలు స్థాపించబడతాయి.

"రాయలసీమలో 5 సెంట్రల్ బ్యాంకులకు 1949-50 లో రూ 1,61 700, 1950-51 లో రూ 71,700 ఋణాలు ఇచ్చేనిమిత్తం ఇవ్వబడినవి. 51-52 కు అంతేమొత్తం ఇవ్వబడింది. భూమితనఖా బ్యాంకుకు ఋణాల నిమిత్తం 24 ఏండ్లపైకు 6,75 లక్షలు ఋణనిమిత్తం ఇవ్వబడింది."

"ఇదివరకు గిడ్డంగులకు ఒక లక్ష రూపాయలు ఇవ్వబడేది. ఇప్పుడు రెండు మూడేళ్లుగా రూ. 6 లక్షలు గా వచ్చింపబడుతోంది. సేలం గిడ్డంగుల్లో 22 లక్షల వ్యాపారం, తిరుచెందూరులో 18 లక్షల వ్యాపారం గత సాలున జరిగిందంటే ఈ గిడ్డంగుల ప్రయోజనం బోధపడగలదు."

"చెన్నరాష్ట్ర చేనేత పద్ధతి చాలా ప్రసిద్ధమైనది. చేనేత సహకార సంఘం క్రింద 954 సంఘాలు 1,49,802 మగ్గాలు ఉన్నవి. అనగా ఉన్న మగ్గాలలో 1/8 వంతు సహకార ఉద్యమం వ్యాపించింది. చేనేత వస్తువులు సాలుకు రూ 323.16 లక్షల విలువగలవి ఇచ్చట ఉత్పత్తి అయి రు 421.8 లక్షలు క్రయం అవుతున్నది."

"గుంతకల్లులో 11,000 మరకదుర్లనూలు ఫ్యాక్టరీ 1952 చివరకు పూర్తి కాగలదు. ఈరోడ్డులో ఆరు లక్షలు వచ్చించి చేనేతబట్టకు మెరుగు బెట్టే యంత్రాన్ని నెలకొల్పనున్నారు."

"పారిశ్రామిక గ్రామాల్లో గృహనిర్మాణం నిమిత్తం రు 15 లక్షలు ప్రభుత్వం ఏర్పాటు చేస్తున్నారు. ప్రస్తుతం భూములు కొనడంలోనే ఈ వ్యవహారం ఉన్నది. 290 గృహనిర్మాణ సహకారసంఘాలు రాష్ట్రంలో వెలసినవి. 1950-51 లో వీటికి రూ 80 లక్షలు ఋణంఅందింది. 1739 ఇళ్లు నిర్మాణమైనవి. 1868 ఇళ్లు నిర్మాణంలో ఉన్నవి. గృహనిర్మాణ సమస్య ప్రభుత్వం ఒక్కటే పరిష్కరించలేదు. ప్రజలు గూడా తోడ్పడాలి." "రు 200 లు. అంతకు లోబడిన జీతంగల సెక్రటేరియట్ ఉద్యోగులకు గృహనిర్మాణస్కీము మంజూరైంది."

కోటాకు మూడు ఇళ్ళ చొ॥ గృహనిర్మాణ ప్రణాళిక క్రింద తయారవుతున్నాయని రయాన్‌గారు చెప్పగానే ఈ ప్రకారం ఎన్నటికి ఈ సమస్యపరిష్కారమవుతుందని పత్రికా ప్రతినిధులు అడిగారు. ప్రభుత్వం ఒక్కరే ఈ సమస్యను పరిష్కరింపలేరని మంత్రిగారు చెప్పారు. గాంధీగారిపేరిటఅవుతున్న భాగ్యవంతులకు ఇండ్లనిమిత్తం డబ్బు ఋణసహాయం చేశారు. అని అనగా రయాన్‌గారు పెద్దఉద్యోగులకు మాత్రమే ఉంటేటానికి ఇళ్లు ... "లేదా? కన్న అండ ... తమ ఉద్యోగులకుఇళ్లు ఇవ్వడం లేదా?" అన్నారు.

## మద్రాసుకు అమెరికన్ గోధుమల ఓడరాక

### రేవులో స్వాగతోత్సవం

మదరాసు, సెప్టెంబరు 8: అత్యవసర ఆహార సహాయబిల్లు క్రింద సప్లయి అయిన గోధుమలతో అమెరికానుంచి మొదటిసారిగ ఒకఓడ 6వ తేదీన మదరాసు చేరింది.

ఈ సరకును తీసుకొనవచ్చిన యస్. యస్. జాకోబ్ ఎ. జస్టర్ వల్లు అనే ఓడమీద ఆ నాటి ఉదయం నిరాడంబరముగ ఉత్సవం జరిపారు. ఒక చిన్న గోధుమల సంచికి ఒకవైపు జాతీయ పతాకమును, మరొకవైపు అమెరికన్ పతాకమునుచుట్టి మదరాసు ఆహార మంత్రి శ్రీ జె. యల్. పి. రోచ్ విక్టోరియాకు బహూకరించారు.

ఆ సందర్భంలో ఉపన్యాసములు చేసిన ఆహార మంత్రి అమెరికన్ కౌన్సల్ రాబర్ట్ రోస్సో జూనియర్ రెండుదేశాల మధ్యగల స్నేహభావములను వ్యక్తపరచారు. ఈ దేశానికి అందులో ముఖ్యంగా ఈ రాష్ట్రానికి సహాయం పంపుతున్నందుకు ఆహార మంత్రి కృతజ్ఞత తెలిపారు. ఇదేగాక ఆహారమంత్రికి అమెరికన్ పౌరుల నుండి పందలాది ఆహారపొట్లాలు అందివాయి.

ప్రాంతీయ ఆహారకమిషనర్ మహబూబ్ మియాన్ సాహెబ్, పోర్టు ట్రస్టు చైర్మన్ శ్రీ జి. వెంకటేశ్వర అయ్యర్ ప్రభుత్వోద్యోగులు పలువురు ఈ ఉత్సవంలో పాల్గొన్నారు. ఇక్కడ 2 వేల టన్నులుదింపి "సస్టరు వెట్" మిగతా సరుకును కలకత్తా తీసుకొని వెళుతుంది.

## రేడియో

### సెప్టెంబరు 11 మంగళవారం

విజయవాడ

ఉ॥ 7-0 తెలుగున వా॥ 7-15 మద్రాసు (బి) వలె 7.30 మద్రాసువలె 8.0 ఆంగ్లమున వా॥

మ॥ 12 30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు హిందీపాఠము మన పక్షిజాతము నెమలి ప్రసంగం. ఎం. దొరస్వం అయ్యంగార్ 1-0 మదరాసు (బి) వలె. 1-3॥ మద్రాసు (ఎ) వలె 1-40 హిందీలో వా॥ 1-50 తెలుగున వా॥ 2-0 మద్రాసు (బి) వలె 2.15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు మాతృకోశము దండ్రమతి ప్రసంగం. టి. రామచంద్ర బృందగానము. 4-0 ప్రాథమిక పాఠశాలావిద్యార్థులకు అపూర్వగ్రంథముల ప్రసంగం శ, కాలధారబృందగానము.

సా॥ 5-30 డి. పార్వతి 5-50 షేక్‌బీర్ సాహెబ్ నయోలిన 6-10 స్థానికప్రకటనలు వాతావరణము 6-20 గీతమంజరి (బి) ఎం, కృష్ణకుమారి వి. రాజరత్నం 6-30 గ్రామస్థుల కార్యక్రమం వ్యవసాయగోష్ఠి పశుగు వరుగు వరంబో, భక్తిగీతం విశేషాలు ప్రకటనలు దరలు వాతావరణము 7-0 తెలుగున వా॥ 7-15 గ్రామస్థుల కార్యక్రమం గోష్ఠిగానము 7-30 సంగీతకథ 7-45 చిత్రవాణి (బి) కాజల్, దులారి, దాస్, ముక్తి, దేవదాస్, 8-0 డి. పార్వతి 8-30 షేకబీర్‌సాహెబ్ నయోలిన 9-0 ఆంగ్లమున వా॥ 9-15 ఆంగ్లమున ప్రసంగం, 9-30 ముగింపు.

మద్రాసు (ఎ)

ఉ॥ 7-0 స్వాగతము 7-30 టి. కె. రంగాచారి 8-0 ఆంగ్లమున వా॥

మ॥ 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు తమిళమున 1.0 మహిళామండలి 1.30 గీతమంజరి (బి) 1-40 హిందీలో వా॥ 1-50 చిత్ర సంగీతం (బి) 2-10 (బి) వలె 2.15 ఉన్నత పాఠశాలావిద్యార్థులకు తమిళమున 4-0 ప్రాథమిక పాఠశాలావిద్యార్థులకు తమిళమున 4-30 పాశ్చాత్యసంగీతం (బి)

సా॥ 5.30 తిరుప్పూరాకరర్ శ్రీనివాసయ్యర్ 6-0 ఆంగ్లమున వా॥ 6-10 స్థానిక ప్రకటనలు వాతావరణము 6-20 మాయవరం కె. వి. వేణుగోపాలయ్యర్ 7-0 ఎన్ వి. వసంతకోకిలం (బి) 7-30 తమిళమున ప్రసంగం 7-45 చిత్ర సంగీతం (బి) 8-0 టి. సుబ్రహ్మణ్యపిళ్ళై నాదస్వరం తిరువిడండి 8.0 ఆంగ్లమున వా॥ 9.15 హిందీ పాఠము 9-30 వార్తసంగీతం (బి) కోమలవల్లి శ్రీనివాసన్, కె. సావిత్రి, టి. ఆర్. మహాలింగం, ధనమ్మాళ్ 10 (బి) వలె 10.30 ముగింపు.

మద్రాసు (బి)

ఉ॥ 7 తెలుగున వా॥ 7-15 ఉదయగానము (బి) రాధ జయలక్ష్మి, టి. సూర్యకుమారి 7-30 (ఎ) వలె.

మ॥ 12 కార్మికుల కార్యక్రమం 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు హిందీ పాఠము మన పక్షిజాలము నెమలి ప్రసంగం, ఎం, దొరస్వం అయ్యంగార్ 1 గీతమాలిక (బి) 1-30 ఆంగ్లమున వా॥ 1-40 చిత్ర సంగీతం (బి) మేడ్ మాన్, డాబుల్ 1-50 తెలుగున వా॥ 2 పారంగినియు విద్యాంసులు 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు మాతృకోశము ధంద్రమతి ప్రసంగం. టి. రామచంద్ర బృందగానము 4 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు అపూర్వ గ్రంథముల ఎవిడ్ ప్రసంగం. టి శారదాంబ బృందగానం.

సా॥ 5 30 (ఎ) వలె 6-20 సాయంసంగీతం (బి) వైణం వసన్వతి ఎస్. ఏ. సుందరం 6-30 గ్రామస్థుల కార్యక్రమం వ్యవసాయగోష్ఠి భక్తిగీతం విశేషాలు ప్రకటనలు ధరలు వాతావరణము 7 తెలుగున వా॥ 7-15 గ్రామస్థుల కార్యక్రమం గోష్ఠిగానము 7.30 సంస్కృత నాటకము రత్నావళి ప్రసంగం వి. రంగయ్య 7-45 (ఎ) వలె 9-15 సుబ్రహ్మణ్యభారతి దివ్యవాణి తిరుపనుండి 10 తమిళమున సంగీత రూపకము. 10-30 ముగింపు.

హైదరాబాద్

ఉ॥ 7 తెలుగున వా॥ 7-15 తెలుగు హిందీలలో నేటి కార్యక్రమం పఠనం 7.20 వి ఎస్. లక్ష్మీనారాయణ 8 ఆంగ్లమునవా॥ 8-15 హిందీ పాఠము తెలుగున 8-30 వి. వి. పలాకర్, ఖ్యాల్ 8-50 హవానా చలోపాధ్యాయ రిలీజ్.

మ॥ 12 30 గీతమంజరి (బి) 1 తంబ్ మామూర్ (బి) 1-10 కదంబం (బి) 1-30 ఆంగ్లమున వా॥ 1.40 నాదస్వరం (బి) 1-50 తెలుగున వా॥

సా॥ 5-30 మహారాష్ట్రమున కార్యక్రమం 6 ఆంగ్లమున వా॥ 6.10 స్థానిక ప్రకటనలు 6-20 హవానా చలోపాధ్యాయ గీత్ 6-30 వి. వి. పలాకర్ ఠుమ్రీ ఉమ్రీ 6-45 గ్రామసీమ ఆధ్వమలు 7 తెలుగున వా॥ 7-45 గ్రామసీమ జరిగిన నాటక పఠన కె. కోదండరామశాస్త్రి విశేషాలు మార్కెట్ ధరలు వాతావరణము 8-15 ఉర్దూ ప్రసంగం 8-30 హవానా చలోపాధ్యాయ గీత్ 8-45 వి. వి. పలాకర్ 9-0 ఆంగ్లమున వా॥ 9-15 హిందీలో వా॥ 9-30 ద్వారం నరసింగరావు 10-15 ముగింపు.

### కార్పొరేషన్ బాండు

మద్రాసు, సెప్టెంబరు 9: వేప్పసాయంకాలం ... కార్పొరేషన్ బ్యాంకువద్ద సమ్మెకు జరుగనుంది ... వం ఉంటుంది.

## కృషికలోకపార్టీ విశిష్టత

### ఎన్. జి. రంగాగారి ప్రకటన

ఢిల్లీ, సెప్టెంబరు 8: కృషికలోక పార్టీ అధ్యక్షుడు ఎన్. జి. రంగాగారు యీవల చేసిన ఒక ప్రకటనలో తమ పార్టీ ఆంగ్లో-అమెరికన్ వర్గానికి ఎంతమాత్రమూ చెందలేదని అన్నారు. ప్రజాస్వామ్య సూత్రాలను అనుసరించే యేదళంతోనైనా తమపార్టీ సహకరించగలదని వివరపరిచారు.

రాష్ట్రసంఘాలకు స్వతంత్ర ప్రతిపత్తిని కల్పించివుంచుటమే ఈపార్టీవిశిష్ట లక్షణంగా రంగాగారు పేర్కొన్నారు. ఈ పార్టీ కేంద్ర వ్యవస్థకు కేంద్ర పార్లమెంటువ్యవహారాలలోనూ, ప్రజాసామాన్యానికంతటికీ వర్తించగలసమస్యల విషయంలోనూ వుత్తరువులు చేసే అధికారం కలిగివుంటుందనీ, మిగిలిన అన్ని విషయాలలో అంతిమ నిర్ణయాలు చేసుకొనే అధికారం రాష్ట్ర సంఘాలకు దత్తం చేయబడగలవనీ అన్నారు.

## ఎన్నికలలో మొత్తం 38 పార్టీలు

ఢిల్లీ, సెప్టెంబరు 7: ఎన్నికలలో వోట్లు పెట్టెలమీద ఆయా పార్టీలకు గుర్తుగా ముద్రించవలసిన చిహ్నముద్రికలను ఏర్పాటు చేయవలసినదిగా 38 పార్టీలు (రాజకీయ పక్షములు) దరఖాస్తులు చేసినవని నేడు యిండియాపార్లమెంటులో వేలాయుధనుగారిప్రశ్నకు న్యాయశాఖా మంత్రి డా॥ అంబేద్కరుగారు లిఖితసమాధానమునిచ్చిరి.

## డిటెన్యూల దరఖాస్తులు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 7: ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టాన్ని అనుసరించి 2891 కేసులు సలహాసంఘాల ముందు వుంచబడినాయని హోంమంత్రి శ్రీ రాజగోపాలాచారి నేడు పార్లమెంటులో చెప్పారు.

సలహా సంఘాలవారి సిఫార్సుల ప్రకారం 730 మంది డిటెన్యూలువదిలి పెట్టబడ్డారు. ఇంకా 110 కేసులు సలహాసంఘాల ముందుకు పంపవలసినవి వున్నాయి. ఇంతవరకు యీ చట్టం ప్రకారం ప్రభుత్వ ఇంతవరకు 26 సలహాసంఘాలను ఏర్పాటుచేసింది.

1950 ఫిబ్రవరి 25 నుండి 1951 జూలై 31 లోపల 19 మంది డిటెన్యూలు చనిపోయినట్లు శ్రీ కామత్ వేసినప్రశ్నకు సమాధానం ఇస్తూ హోంమంత్రి వెల్లడిచేశారు. ఇందు 17 మంది ఒక్క హైదరాబాదులో చనిపోయారు.

ఒక్క మద్రాసులో మాత్రమే ఒక డిటెన్యూ తుపాకీ గుళ్ళకు గురియై చనిపోయాడు. తక్కిన అందరు క్షయ వల్ల, మసూచివల్ల నీళ్ళ విరేచనాలవల్ల చనిపోయారు.

## నోటీసు

1950 సం॥పు ఇండియన్ కంపెనీస్ ఆక్టు VII విషయమునను
బ్యాంక్ ఆఫ్ హిందుస్థాన్ లిమిటెడ్ (లిక్విడేషనులో ఉన్నది) విషయమునను
1948 సం॥పు ఒ. పి. నం. 265.

పైన తెల్పిన కంపెనీయొక్క (క్రెడిటర్లు 1951 అక్టోబరు 5-వ తేదీన గాని అలోపున గాని తమపేర్లు, చిరునామాలు, తమ అప్పుల లేక క్లెయిముల వివరములు (1913-వ సం॥పు ఇండియన్ కంపెనీస్ ఆక్టు క్రింద మద్రాసు హైకోర్టు నిర్మించిన నిబంధనలకు అనుబంధములో ఇవ్వబడిన 27-వ ఫారంలో అఫిడవిటు క్రింద), తమ అడ్వకేట్లు ఉండినచో వారి పేర్లు, చిరునామాలు 119, ఆర్మీనియన్ వీధి, జి. టి. మద్రాసులోని పై తెల్పిన కంపెనీ జాయింట్ అఫిషియల్ లిక్విడేటర్లగు మెస్సర్సు బ్రహ్మయ్య అండ్ కో.కు పంపవలెను. జాయింటు అఫిషియల్ లిక్విడేటర్లు లిఖితపూర్వకముగ నోటీసు ద్వారా కోరు పక్షమున వారు (క్రెడిటర్లు). అట్టి నోటీసులో తెల్పబడిన సమయమున అట్టి అప్పుల లేక క్లెయిముల విచారణకు స్వయముగ గాని తమ అడ్వకేట్ల ద్వారా గాని హాజరు కావలెను. అట్లు చేయనిచో, వారు అట్టి అప్పులు ఋజువు అగుటకు ముందుగ ఎట్టి పంపకములైన జరుగుచో, వాటినుండి మినహాయింపబడెదరు. బ్యాంకు పుస్తకములలో ఎవరి పేర్లు డిపాజిటర్లుగ కనబడుచున్నవో అట్టి డిపాజిటర్లు కంపెనీ పుస్తకములలో కనబడు మొత్తములకు క్రెడిటర్లుగ ఋజువు లేకుండ చేర్చుకొనబడెదరు.

బ్రహ్మయ్య అండ్ కో,
జాయింట్ అఫిషియల్ లిక్విడేటర్లు,
119, ఆర్మీనియన్ వీధి,
5-9-1951. మద్రాసు.

# జపాన్ శాంతి సంధి

(1 వ పేజీ తరువాయి)

ఈఒప్పందం ప్రకారం ఈ అమెరికన్ సైన్యాలు అంతర్జాతీయం శాంతి భద్రతలను కాపాడటానికి వినియోగింపబడతాయి. జపానుమీద పరాయి రాజ్యాల దండయాత్రలు జరగకుండా చూస్తాయి. జపానులో గనుక ఇతర రాజ్యాల ప్రేరణవల్ల విప్లవాలు అల్లరులు పెద్దఎత్తున బయలుదేరితే, ఆ దేశం ప్రభుత్వం ప్రార్థనను అనుసరించి, వాటని అణచడానికి తోడ్పడతాయి.

ఈ ఒప్పందంవల్ల జపాను భద్రత సురక్షితం అవుతున్నదని, దీనిని తన దేశం హృదయపూర్వకంగా పాలిస్తుందని జపానుప్రధాని యోషిదా అన్నారు.

ఎచిసన్‌గూడా ఈ సందర్భంలో కొంత ప్రసంగించారు. ఈ జపాను రక్షణసంధి పసిఫిక్ రంగంలో శాంతి రక్షణ విధానానికి నమూనా కాగలదని ఆయన ఉద్ఘోషించారు.

ఈ సందర్భంలో అచిసన్‌కు, యోషిదాకు మధ్య నడిచిన ఉత్తర ప్రత్యుత్తరాలు గూడా ప్రకటింపబడినాయి.

## సోవియట్ ప్రతినిధి విమర్శ

శాన్‌ఫ్రాన్‌సిస్కో, సెప్టెంబరు 8: మరో కొత్త యుద్ధం ప్రారంభం కావడానికి తగినట్లుగా జపాను శాంతిసంధి వున్నదని సోవియట్ ప్రతినిధి అంద్రీ గ్రోమికో నేడు యిచ్చట పత్రికా విలేఖరుల సమావేశం జరిపి అందులో ఉద్ఘోషించారు.

జపాను శాంతిసంధి సభతో రష్యా అన్ని సంబంధాలను వదులుకుంటున్నదని ఆయన స్పష్టం చేశారు.

ఈ మూడు రోజులనుంచి సభకు ఎప్పుడూ ఆలస్యంగారాని గ్రోమికో ఇవ్వాళ్ల 10 నిమిషాలు ఆలస్యంగా వచ్చారు. దాదాపు 300 మంది పత్రికా విలేఖరులు, ఛాయా గ్రాహకులు, రేడియో టెలివిజన్ మనుష్యులు యీ గోష్ఠికి హాజరైనారు. అవతల జపాను శాంతి సంధిమీద సంతకాలు జరుగుతూ వుండగా ఇవతల గ్రోమైకో ఈ గోష్ఠిని జరిపారు.

ఫ్రిస్కో సభ జపానును అమెరికా సైనిక స్థావరంగా మార్చి వేస్తున్నదని, జపానులో అమెరికా బలాలను వుంచడం అన్నదే ఈ సంధియొక్క ముఖ్య ఉద్దేశం అని గ్రోమైకో వివరించారు. యుద్ధానిచ్చి కీర్తివుల్లో డల్లెస్‌ను చెప్పి మరొకళ్లను చెప్పాలి. అట్టివాని నాయకత్వంలో అమెరికా దూరప్రాచ్యంలో విజిగీషుమండలాన్ని నిర్మిస్తున్నది. అని ఆయన ఉద్ఘోషించారు.

రష్యా ఇంకా జపాను యుద్ధఖైదీలను కొన్ని లక్షలమందిని వదలనిమాట నిజమేనా అని అడగ్గా, అవన్నీ తప్పుడు ప్రచారాలు పొమ్మని గ్రోమైకో సమాధానం ఇచ్చారు. సోవియట్ యూనియన్‌లో జపాను యుద్ధఖైదీ లెవ్వరూ లేరు. అని ఆయన విశదం చేశారు.

స్టాలిన్ ఆరోగ్యాన్ని గురించి ఒక విలేఖరి ప్రశ్నించాడు. స్టాలిన్ ఆరోగ్యం ఎప్పుడూ బాగానే వుంటుందని గ్రోమైకో సమాధానం ఇచ్చారు.

ఈ గోష్ఠిలో జపాను శాంతిసంధి విషయంలో రాజ్యభావాలను విశదీకరించే ఒక దీర్ఘప్రకటనను గ్రోమైకో అతివేగంగా చదివారు. ఫ్రిస్కో శాంతిసభతో రష్యా సంబంధాలు త్రెంచుకొంది. అందువల్ల తాను శాంతిసంధిమీద సంతకం చేయలేను. ఇది ఆ ప్రకటన తాత్పర్యం.

అయితే ఈ సంధి ఆధారంగా దూరప్రాచ్యంలో రష్యా అమెరికాలమధ్య యుద్ధం ఏమన్నా పొసగుతుందనిమీరు అనుకుంటున్నారా? అని ఒక విలేఖరి ఆయన్ను ప్రశ్నించాడు. ఈ ఆంగ్లో-అమెరికన్ చిత్తుకు దూరప్రాచ్యంలో సమస్యలను పరిష్కరించే తాహతులేదని ఇదివరకే చెప్పాను. అసలు ఇది అట్టి పరిష్కారంకోసం తయారు చేయబడింది కాదని, యుద్ధం కోసం వేసిన పథకమని ఇప్పుడు చెబుతున్నానుఅని ఆయన సమాధానం చెప్పారు.

మరో ప్రశ్నకు సమాధానం ఇస్తూ, సఖాలీన్ హైన ద్వీపంమీద సోవియట్ వాల్లభ్యం స్థిరపడిందని గ్రోమైకో విశదంచేశారు. ఇది జపానుకు ఉత్తరంగావుంది. ఇక ఈ సంధిని బలపరచడం అంటే సోవియట్ రష్యా లేని విశ్వశాంతి నిర్వహణకు ఏర్పాటు అవుతుంది అని అన్నారు.

ఈ సంధిని జపానుమీద రుద్దుతున్నవాళ్లకు ఒక పెద్ద హెచ్చరిక నుచేశారు. ఇదుగో నేను ఇప్పుడే చెబుతున్నాను. ఈ సంధిని జపానుపైన ఎవరు రుద్దుతున్నారో, వారు ప్రపంచంలో అందువల్లకలిగే ఫలితాలకు బాధ్యత వహించవలసి వస్తుంది అని ఆ హెచ్చరిక తాత్పర్యం.

### జపానుతో భారతదేశ యుద్ధదశ సమాప్తి?

టోకియో, సెప్టెంబరు 9: ఇంకో 24 గంటల్లోగా భారత ప్రభుత్వం జపానులో "యుద్ధదశ" సమాప్తమైనట్లుగా ప్రకటించవచ్చునని, జపానులోని భారత ప్రతినిధి కెప్టెన్ నాదు రేపో ఈ విషయాన్ని అధికారికంగా తెలియజేయగలరని, జపాను పత్రికలు ప్రకటించాయి.

# కాంగ్రెస్ అధ్యక్షుడుగా పండిట్ నెహ్రూ ఎన్నిక

(1 వ పేజీ తరువాయి)

"ఆగస్టు 6 వ తేదీన కార్యవర్గ సభ్యత్వానికి పండిట్ నెహ్రూ రాజీనామా ఇవ్వడమే నేనిప్పుడు రాజీనామా ఇవ్వడానికి ముఖ్యకారణం.

పండిట్ నెహ్రూను రాజీనామా ఉపసంహరించుకొనేటట్లు చేయడానికి కార్యవర్గ సభ్యులూ నేనూ కూడా తీవ్రంగా ప్రయత్నించాము. కాని మా ప్రయత్నాలవల్ల ఏమీ లాభంలేకపోయింది. ప్రస్తుత కార్యవర్గాన్ని రద్దుచేసి దానిస్థానే ఒక కొత్త కార్యవర్గాన్ని ఏర్పాటుచేయాలని పండిట్ నెహ్రూ వాదం. ఇందుకు నేను అంగీకరించలేకుండా వున్నాను. కారణం, నా అభిప్రాయంలో పండిట్ నెహ్రూ ఈ కోరిక పూర్తిగా అనుచితమైనదే గాక కాంగ్రెసు నిబంధనావళికి వ్యతిరిక్తమైనది.

అదలావుంచి, అసలీ కార్యవర్గ సభ్యులలో సగానికిపైగా, 4 గురు కాంగ్రెసు పెద్దలతో సంప్రతించిన మీదట ఎంచుకోబడ్డవారే. ఆ సంప్రతించినవారిలో పండిట్ నెహ్రూ కూడా వున్నారు; తక్కినవారు కీర్తిశేషులైన సర్దార్ వల్లభాయ్‌పటేలు; మౌలానా అబుల్ కలాం ఆజాద్; శ్రీ సి. రాజగోపాలాచారి. తక్కిన సగం మంది అక్టోబరు 16వ తేదీనఎంచుకోబడ్డారు. ఈరెండోసారి జరిగిన సంప్రతింపులకు, జవహర్లాల్ నెహ్రూ తప్ప తక్కిన ముగ్గురు హాజరైనారు. పార్లమెంటరీ కమిటీ నియామకం ఎల్లా జరిగితే ఏం అనుకున్నా, దానిని పునర్నిర్మించవలసినంత తప్పిదం అదియేమి చేసిందో నాకు అర్థంకావడంలేదు. కార్యవర్గాన్ని పునర్నిర్మిస్తే, కాంగ్రెసులో మానసికంగా ఏదో గొప్ప పరిణామం వస్తుందని పండిట్ నెహ్రూ అభిప్రాయ పడుతున్నారు. ఈ అభిప్రాయంతో నేను సుతరామూ ఏకీభవించలేక పోతున్నాను. ఈపది నెలలుగా ప్రస్తుత కార్యవర్గం చేసిన కృషివల్ల, కాంగ్రెసు సంస్థయొక్క నైతికస్థాయి బాగా పెరిగిందని నాఅభిప్రాయం. జవహర్లాల్ నెహ్రూ రాజీనామా వల్ల కాంగ్రెసుకు చాలా హాని కలిగిందని కూడ నేను అభిప్రాయ పడుతున్నాను.

జవహర్లాల్ నెహ్రూ రాజీనామాను నేను అంగీకరించజాలను. ఏమంటే, భారతజాతికి ఈ నాడు ఆయనే ప్రతినిధి అయినా, కాంగ్రెసు నిబంధనావళి దృష్ట్యా ఏమి, ఉచితానుచితాల దృష్ట్యా ఏమి కార్యవర్గాన్ని పునర్నిర్మించాలన్న ఆయన కోరికను పాటించడం నాకు సాధ్యంగాదు. కనుక ఈసందిగ్ధావస్థలో అధ్యక్షపదవికి రాజీనామా ఇవ్వడం మినహా నాకు వేరేమార్గాంతరంలేదు. ఈ అధ్యక్షపదవి భారంనుండి నన్ను విడిచిపెట్టవలసిందిగా మీకు వినతి చేస్తున్నాను. అని టాండన్ గారు విజ్ఞప్తి చేశారు. మౌలానా అబుల్ కలాం ఆజాద్ గారు ఆగస్టు 16 తేదీన కార్యవర్గానికి రాజీనామా ఇచ్చారనీ, తర్వాత ఈ 2 రోజుల్లో తక్కిన సభ్యులు కూడా రాజీనామాలు దాఖలుచేశారనీ, టాండన్ గారు సభవారికి తెలియజేశారు.

అధ్యక్షుని ఈ ఉపన్యాసానంతరం ఏ. ఐ. సి. సి. టాండన్ గారి రాజీనామాను ఆమోదిస్తూ, నెహ్రూను ఆయన స్థానే అధ్యక్షపదవిని స్వీకరించవలసిందిగా కోరుతూనూ పైన చెప్పివున్న విధంగా 2 తీర్మానాలను చేసింది.

ఈ రెండు తీర్మానాలూ అయిన తర్వాత, అధ్యక్షాసనాన్ని అధిష్ఠించవలసిందిగా టాండన్ గారు పండిట్ నెహ్రూను కోరారు. కాని నెహ్రూ ఈ 2 రోజులూ టాండన్ గారినే సమావేశానికి అధ్యక్షత వహించవలసిందని అడుగగా అందుకు టాండన్ గారు సమ్మతించారు. తర్వాత నెహ్రూ దాదాపు ఒక గంట సేపు మొదట ఇంగ్లీషులోను తర్వాత హిందీలోను తన వైఖరిని వివరిస్తూ ఉపన్యసించారు. కార్యవర్గాన్ని పునర్నిర్మించవలసిందని తాను కోరడానికి కారణాలు ఏమిటో పండిట్ నెహ్రూ తమ ప్రసంగంలో పునరుచ్చరించారు. కార్యవర్గ సభ్యత్వానికి తాను రాజీనామా ఇవ్వడంవల్ల కాంగ్రెసులో ఒక కొత్త సంచలనం, ఒక కొత్త చైతన్యం బయలుదేరుతుందని తాను ఆశించిన ఆశ వమ్ము కాలేదనీ, కాంగ్రెసులో ఏర్పడిన ఈ అసాధారణ పరిస్థితి, ఇండియా పాకిస్తాన్ల వివాదంకూడా మరుగున పడేటంతగా ప్రజల దృష్టినీ పత్రికల దృష్టిని ఆకర్షించిందనీ, పండిట్ నెహ్రూ ఉద్ఘాటించారు.

తన రాజీనామావల్ల కాంగ్రెసు బలహీనపడిందన్న టాండన్ గారి అభిప్రాయంతో తాను ఏకీభవించజాలనని ఆయన అన్నారు. పైపెచ్చు, కాంగ్రెసు యీ పరిణామాలంగా కొత్త బలాన్ని కొత్త ఉత్సాహాన్ని చేకూర్చుకొన్నదని పండిట్ నెహ్రూ నొక్కి చెప్పారు.

తర్వాత కాంగ్రెసు అధ్యక్షతను స్వీకరించవలసిందిగా కోరుతూ ఏ. ఐ. సి. సి. చేసిన తీర్మానం ప్రసక్తి తెచ్చి, "అనివార్యమైన పరిస్థితి వచ్చినప్పుడు అధ్యక్ష పదవి స్వీకరించడానికి నేను సిద్ధమే అని లోగడ నేను చెప్పివున్నప్పటికీ, ఈ వ్యవహారాన్ని శాంతంగా సమగ్రంగా విచారించవలసిందని సభ్యులకు నేను విజ్ఞప్తి చేస్తున్నాను; ఈ రోజంతా ఈ విషయాన్ని గురించి తీవ్రంగా ఆలోచించి, రేపటి సమావేశానికి నిర్మలమైన మనస్సులతో నిష్కృష్టమయిన అభిప్రాయాలతో రావలసిందిగా కోరుతున్నాను. నేను కూడా దీనినిగురించి నా స్నేహితులతో సంప్రతించవలసివుంది; నిర్ణయానికి రావడానికి నాకు కొంత వ్యవధి కావాలి" అని పండిట్ నెహ్రూ చెప్పారు.

"నేనూ టాండన్‌జీ రాజకీయాలలో చిరకాల సహవాసులం; కాని మా ఈ దీర్ఘ సాహచర్యంలో నా అభిప్రాయాలూ, ఆయన అభిప్రాయాలు, నా దృక్పథమూ, ఆయన దృక్పథమూ ఎప్పుడూ, కలవలేదు. కానైతే, ఆయనంటే నాకు మిక్కుటమైన అనురాగమూ ఆదరమూ ఉన్నాయి. కాబట్టి, ఈ వివాద కేవలం వ్యక్తిగతమైనదిగా భావించేందుకు అవకాశం లేదు. అసలు నేను ఇటీవల చేసినపని ఎప్పుడో చేయవలసింది; ఇంతకాలం రాజీనామా ఇవ్వకుండా ఆగానంటే, టాండన్‌గారిమీద వ్యక్తిగతంగా నాకున్న గౌరవాదరాలవల్లనే. ఎంతో కాలం ఆచి ఆచి ఆలోచించి ఆలోచించి చివరికి రాజీనామా ఇవ్వాలన్న నిర్ణయానికి వచ్చాను.

సామాన్య ప్రజానీకంనుంచి కాంగ్రెసు అంతకంతకూ దూరమైపోతూ వుండడం విచారకరం.

ఇలాంటి పరిస్థితిలో ఉదాసీనత ఉపేక్షాభావం ఎంతమాత్రం పనికిరావు; ఇందులో నేను ఎవరినీ ప్రత్యేకించి ఏమీ అంటున్నది లేదు. అసలు నిజానికి ప్రస్తుత కార్యవర్గ సభ్యులు సరిగా పని చేయడం లేదనిగాని, వారేవో అపరాధాలు చేశారనిగాని నేను ఎప్పుడూ అనలేదు. నేను కోరుతున్నదల్లా ఏమిటంటే, కాంగ్రెసులో మార్పు రావాలి; కాంగ్రెసు మళ్లీ పునరుజ్జీవితం కావాలి. అని మాత్రమే. ఏ. ఐ. సి. సి. చేసిన తీర్మానాన్ని నేను అంగీకరించడం అసలు భావ్యమా అని నాకు అనుమానంగా వుంది. ప్రధాని మంత్రి అయినవాడు కాంగ్రెసు అధ్యక్షపదవిని వహించడం భావ్యంకాదనే నేను మొదట్నుంచి అభిప్రాయ పడుతున్నాను. కాని ఒక అసాధారణ పరిస్థితిని కల్పించి, తీరా సమయానికి బాధ్యత తప్పించుకోవడం కూడా సమంజసం కాదనే విషయమూ నేను గుర్తించే వున్నాను. అసాధారణ పరిస్థితులు ఏర్పడినప్పుడు సిగ్గుపడడం సంకోచించడం పనికిరాదు.

అసలు ఈప్రధానమంత్రి పదవిని వదలిపెట్టి, కాంగ్రెసుకే నా సర్వశక్తులూ ధారపోద్దామని నామనస్సులో ఒకమూల ఈ రెండేళ్ళబట్టీ అనిపిస్తూనే వుంది. కాని, అంతర్జాతీయంగానూ అంతరంగికంగా కూడా పరిస్థితులు విషమించడం, ఈ మొదలైన కొన్ని కారణాలవల్ల ఆ ఆలోచన ఆలోచనగానే వుండిపోయింది. ఇంకో 3 వారాల్లో ఢిల్లీలో కాంగ్రెసు సర్వసభ్య సమావేశం జరపాలని తాను కోరుతున్నట్లు పండిట్ నెహ్రూ సూచించాడు. ఏ. ఐ. సి. సి. రేపు మధ్యాహ్నం రెండున్నర గంటలకు మళ్ళీ సమావేశం అవుతుంది; కాంగ్రెసు సర్వసభ్య సమావేశం జరపడంవిషయం అప్పుడు చర్చకువస్తుంది. రేపటి సమావేశానికి పత్రికా విలేఖరులను రానిస్తారు. ప్రేక్షకులనుమాత్రం రానివ్వరని తెలుస్తున్నది. సమావేశానంతరం పండిట్ నెహ్రూ పత్రికా విలేఖరులతో ప్రసంగిస్తు, కాంగ్రెసు అధ్యక్షపదవిని తాను అప్పుడే స్వీకరించావనడం సరికాదనీ అంతిమనిర్ణయం రేపటికిగాని జరగదని విశదంచేశారు.

ఈవేళ ఏ. ఐ. సి. సి. సమావేశం ప్రారంభమైనప్పుడు 300 మంది విద్యార్థులు సభాభవనం వెలుపల పోగై, పండిట్ నెహ్రూకు అనుకూలంగా నినాదాలు చేశారు.

పండిట్ నెహ్రూ రేపుసాయంత్రం ఏ. ఐ. సి. సి. సభ్యులకు తనఇంట్లో విందుచేస్తారు.

### కిద్వాయ్ వ్యాఖ్య

బొంబాయి, సెప్టెంబరు 9: పండిట్ నెహ్రూ కాంగ్రెసు అధ్యక్షుడుగా ఎన్నిక అయినప్పటికీ, కాంగ్రెసులో తాను మళ్ళీ ప్రవేశించే అవకాశం ఆట్టే లేదని, రఫీఅహ్మద్ కిద్వాయ్‌గారు ఈ వేళ యిక్కడ ప్రకటించారు.

"కాంగ్రెసు అధ్యక్షుడుగా నెహ్రూ ఎన్నిక అవడం ముదావహం. ఇందువల్ల కాంగ్రెసును సంస్కరించడానికి నెహ్రూకు వీలవుతుంది. అయితే, ఈ అధ్యక్షులు మారిన పద్ధతి మాత్రం నా కేమీ రుచించలేదు.

క్రిందటిసారి కాంగ్రెసు అధ్యక్షుని ఎన్నిక జరిగేముందే పండిట్ నెహ్రూ, టాండన్ అధ్యక్షుడుగా ఎన్నికఅయితే కార్యవర్గంలో తాను చేరనని స్పష్టం చేశాడు; అయినా, ఇప్పుడు ఏ కాంగ్రెసు నాయకులైతే టాండన్‌ను వెన్నుతట్టి అధ్యక్షుణ్ణిగా చేశారో ఆ కాంగ్రెసు నాయకులే అప్పుడు నెహ్రూ అభీష్టానికి విరుద్ధంగా టాండన్‌ను ఎన్నుకొన్నారు.

ఎన్నికలలో కాంగ్రెసు గెలిచే అవకాశం సన్నగిల్లుతున్నదని భయపడి, టాండనే తమకు ఇష్టమైనా వారిప్పుడు నెహ్రూను అధ్యక్షునిగా ఎన్నుకొన్నారు. ఇది వట్టి అవకాశవాదం తప్ప మరేమీకాదు; ఇట్టి అవకాశవాదులను సహించడం దేశానికి అరిష్టదాయకం."

### ఘోష్ వ్యాఖ్యానం

కలకత్తా, సెప్టెంబరు 8: కాంగ్రెసు అధ్యక్షపదవికి నెహ్రూ ఎన్నిక అవడాన్ని గురించి, కృషక్ ప్రజా మజ్దూర్ పార్టీ కార్యదర్శి డా॥ పి. సి. ఘోష్ ఈ వేళ వ్యాఖ్యానంచేస్తూ, సెప్టెంబరు 15 వ తేదీన మద్రాసులో కృషక్ ప్రజా మజ్దూర్ పార్టీ కార్యవర్గం సమావేశమైనప్పుడు ఇతర వ్యవహారాలతోపాటు ఈ విషయాన్ని కూడా చర్చించగలదని అన్నాడు.

ఈ పార్టీకి చెందిన మరో ప్రముఖ సభ్యుడు, కాంగ్రెసుపార్టీ నాయకత్వంలో మార్పు వచ్చినంతమాత్రంతో కాంగ్రెసుయెడ తమ వైఖరి మార్చవసరం లేదన్నాడు.

### ప్రకాశంగారి హర్షం

తిరుపతి, సెప్టెంబరు 9: "దేశంలో ఎన్నో రకాల కుట్రలకు, కక్షలకూ కారణభూతులైన టాండన్ గారు, ఆయన కార్యదర్శులూ తొలగిపోయినందుకు నా కెంతో సంతోషంగా వున్నద"ని ప్రకాశం పంతులుగారు కాంగ్రెసు అధ్యక్షపదవికి నెహ్రూ ఎన్నికపై వ్యాఖ్యానిస్తూ అన్నారు. ఆయన ఇంకా యిలా అన్నారు:

"టాండను, వారి కార్యదర్శులు పదవులనుండి తొలగిపోవటమనేది అన్నవస్త్రాలకు అలమటించిపోతున్న భారత ప్రజానీకానికి విమోచనమే. వున్న బాధ్యతలకు తోడు యింకా హెచ్చు బాధ్యతలను, పాపం — నెహ్రూగారు పైన వేసుకొన్నారు. ఆయనగురించి నేనేమీ వ్యాఖ్యానించను. ప్రజలంతా ఆయనతో సహకరిస్తారని ఆశిస్తున్నాను. ఎవరినైతే కార్యదర్శులుగా వేసుకోవద్దని హెచ్చరించామో వారినే కార్యదర్శులుగా వేసుకొని టాండన్‌గారు చేసిన మాదిరి పొరపాటును నెహ్రూ కూడా చేయకుండా వుండాలని కోరుకొంటున్నాను."

ప్రకాశంగారు నెల్లూరుకు వెళ్లారు.

# అక్టోబరు 2 వరకూ ప్రాయోపవేశం

(1 వ పేజీ తరువాయి)

శ్రీమతి దుర్గాంబ త్యాగమూర్తి. ఆమె కూడా ఉత్సాహాన్ని పట్టుదలను త్యజించలేదు. అందరూ ఒకే ఉత్సాహంతో ఉన్నారు. వారు భారత ప్రభుత్వానికి ఇచ్చిన సమస్యా పరిష్కారానికి భారత ప్రభుత్వం దీర్ఘకాలం గుణకారాలు వేసుకుంటూ కూర్చొంటుందని తెలిసే, అంతకాలానికి సరిపడే ఉత్సాహంతో పొట్ట నింపుకొని ఉపవాసానికి దిగినట్లుగా ఉంది.

మధ్యాహ్నం ఒంటిగంటకు శ్రీవారణాసి రామమూర్తి అతి శ్రావ్యంగా తులసీదాసు రామాయణ పఠనాన్ని చేస్తున్నారు. సాయంత్రం 6 గంటలకు తిరిగి ప్రార్థనలు. నిత్యం ఒక బహిరంగ సభ! అప్పుడు స్వామీజీ తమకు ఆనాడువచ్చిన ఉత్తరాల్ని చదివి వినిపిస్తారు. ఆపైన రాత్రి 7-8 గంటలకు ముఖ్య భజన సంగీతాల కాలక్షేపం సకృతుగా భారతినాట్యాలు.

స్వాములవారి అంతరంగికులు, ఆయన అక్టోబర్ 2 నాటివరకు ఉపవాసంచేసి, సత్యాగ్రహ కార్యక్రమాన్ని ఇస్తారని విశ్వసిస్తున్నారు. దేశం నలుమూలలనుంచి, వారి ఈ సంకల్పానికి తమ సహకారాన్ని తెల్పుతూ ఉత్తరాలు వస్తున్నాయి. అనేకులు స్వంతంగావచ్చి సత్యాగ్రహం చేస్తామని చెప్పుకుంటున్నారు. ఈ ఉత్తరాల తరహా చూస్తే, సత్యాగ్రహోద్యమానికి చాలామంది ప్రముఖులు సిద్ధముగా ఉన్నట్టే అనిపిస్తోంది.

విభజన సంఘ నిర్ణయాలను భారత ప్రభుత్వం, గాలిలో వదిలేయకుండా, మధ్యవర్తుల ద్వారా పునః పరిశోధనచేయించి ఏనాడో రాష్ట్ర నిర్మాణం చేయవలసి ఉండెనని వీరందరి అభిప్రాయం. ఒక రాష్ట్రం అంటే ఒక పెద్దజిల్లా తుల్యమే—దాన్ని ప్రత్యేకించటానికి ప్రభుత్వం అశక్తత చూపటం వీరందరికి వింతకల్గిస్తోంది. ఈ అభిప్రాయాల్లో ఎవ్వరికీ తగాదా లేదు. పాపం! - ఉపవాసం చేస్తున్నారే అని సానుభూతి చూపేవారిని చూస్తే కొందరికికష్టం కలుగుతోంది. "వారు (మనం తప్ప!) ఉపవాసం చేయాల్సిందే" అని అనటమే సానుభూతి ప్రకటన అని కొందరిభావన.

### త్వరలోనే స్వామీజీ అనుచరుల ప్రాయోపవేశ విరమణ

గుంటూరు, సెప్టెంబరు 9: తనతో పాటు ప్రాయోపవేశం చేస్తున్న వారిని త్వరలో దీక్షావిరమణం చేయవలసిందిగా కోరబోతున్నట్లు స్వామీ సీతారాం నిన్న సాయంకాలం వెల్లడించారు. తాను మాత్రం యింతలో విరమించబోమన్నట్లు చెప్పారు.

ప్రాయోపవేశం విరమించవలసిందిగా రాష్ట్ర ముఖ్యమంత్రిసహా, పలువురు పంపిన విజ్ఞప్తులకు స్వామీజీ సమాధానం చెప్పుతూ ప్రాయోపవేశం ప్రారంభంకానీ, విరమణంకానీ తమ చేతులలేదనీ, అదంతా భగవత్ప్రేరణవల్లనే జరుగవలసినదనీ అన్నారు. "నా అనుచరుల ప్రాణాలను కాపాడవలెనని నేను చాలా ఆతురపడుతున్నాను. అందువల్ల వీరు వెంటనే ప్రాయోపవేశం విరమించవలసిందిగా వారిని కోరదలిచాను. కానీ వారు ప్రాయోపవేశం కొనసాగిస్తామంటే, నేను అడ్డు చెప్పను" అని అన్నారు. ఎలాంటి పరిణామాలకైనా సంసిద్ధులు కమ్మని ప్రజలనుద్బోధిస్తూ ఆంధ్ర రాష్ట్రోద్యమం 40 ఏండ్ల ప్రాయం కలదని, కనీసం 40 రోజుల పాటైనా కఠోర తపస్సు చేయందే రాష్ట్ర సిద్ధి ఒనగూరదని విస్పష్టంచేశారు.

భావి కార్యక్రమాన్ని చర్చిస్తూ నారాయణరావు ఎం. ఎల్. ఏ., వి. రాఘవయ్య ఎం. ఎల్. ఏ. గార్లు స్వామిజీతో చాలాసేపు చర్చలు జరిపారు. నెహ్రూ గారి ప్రకటన గూర్చి రాఘవయ్య గారి అభిప్రాయం కోసం అడుగగా, ఆ ప్రకటనలోని భాషకానీ భావాలుకానీ నెహ్రూగారివి కావేమోననే అనుమానం తనకు కలుగుతున్నదన్నారు. ముఖ్యంగా కోట్లకొలది ప్రజలకు సంబంధించిన యిలాంటి సందర్భాలలో నెహ్రూగారైతే ఆ మాదిరి భాషను వుపయోగించి ఆ భావాలను ప్రకటింపరని రాఘవయ్యగారుఅన్నారు. అన్ని సమస్యలమీదా ఏకాభిప్రాయాన్ని సేకరించటమనేది బోధించినంత తేలికగా సాధించదగినది కాదని అంటూ, ఆంధ్రరాష్ట్రం కోసం ఆందోళన చేస్తున్నవారు అధికారంలో వున్నవారి ప్రాపకం కోసం ప్రాకులాడేబిచ్చగాళ్లుమాత్రం కాదనే విషయాన్ని అటు కేంద్ర ప్రభుత్వమూ, యిటు రాష్ట్ర ప్రభుత్వమూ కూడా గుర్తుంచుకోవాలని రాఘవయ్యగారు హెచ్చరించారు.

ఆంధ్రరాష్ట్ర సమస్య కారణంగా పలువురు ఆంధ్రశాసనసభ్యులు తమ పదవులకు రాజీనామాలనీయ సంకల్పించినట్లుకూడా విశ్వసనీయంగా తెలుస్తున్నది. ఆంధ్రమహాయజ్ఞం ఆరంభమైనేటికి 25 రోజులు. జిల్లాలోని నలుమూలలనుండి కాలినడకను యాత్రికులు జట్లుజట్లుగా యిక్కడకు వచ్చి చేరుతున్నారు. స్వామీజీతో పాటుగా యిదివరకటి నుండి ప్రాయోపవేశం చేస్తున్న 6 గురు కాక, యీ 1 నుండి పాకాల సుబ్బారావుగారు, మరీ యిద్దరుకూడా ప్రాయోపవేశం ఆరంభించారు. అంగలూరు గాంధీఆశ్రమానికిచెందిన ఎర్నేని సుబ్రహ్మణ్యం గారు, మరి 6 మందికూడా మూడు రోజులనుంచి ప్రాయోపవేశం, చేస్తున్నారు.

ఆంధ్ర దీక్షాదినం సందర్భంలో నేడు పట్టణంలో అంతటా హర్తాల్ జరిగింది. ముఖ్య వీధులగుండా పెద్ద వూరేగింపు నడిచింది. (స్వ. వి.)

### స్వామి సీతారాంకు సికిందరాబాదు మేయరు విజ్ఞప్తి

సికిందరాబాదు, సెప్టెంబరు 8: ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణ విషయమై నిక్కచ్చిగా నెహ్రూగారు హామీ యిచ్చారు కాబట్టి 22 రోజులుగా సాగిస్తున్న ఉపవాసదీక్ష విరమింపవలసిందని కోరుతూ సికిందరాబాదు మేయరు ఆర్. కె. వాసుదేవ మొదలియారుగారూ, మరి 14 మంది కార్పొరేషన్ కౌన్సిలర్లూ కలిసి స్వామీ సీతారాంగారికి యివాళ ఒక తంతి పంపారు.

# అక్టోబరులో కాంగ్రెస్ మహాసభ

(1 వ పేజీ తరువాయి)

కమ్యూనిస్టుల వలె దేశంలో గ్రామ గ్రామాలకు, మూల మూలలకూ వెళ్ళి నిస్స్వార్థంగా కృషిచేయడం నేర్చుకోవాలి" అని నెహ్రూ ఉద్బోధించారు.

"నేను అఖిలభారత కాంగ్రెసు కమిటీకి" పండిట్ నెహ్రూ తన సంకల్పాభిప్రాయములను యీ రీతిగా స్పష్టపరిచెను:

నన్ను మీరు కాంగ్రెసు ప్రెసిడెంటుగా నుండగోరినట్లయితే మనమందరమూ ఏకం కావాలి. ఒక జనసమూహం ఏకమైనట్లుగా ఏకం కాగూడదు—మనమందరము ఒక పటాలమువలె కలిసి నడవాలి. కాంగ్రెసు వాదులందరూ బ్రహ్మాండమైన గాలిదుమారమును దేశమంతటా లేవగొట్టాలి. అక్రమసిద్ధాంతాలను, అక్రమ ప్రవర్తనగలవారిని పూర్తిగా తుడిచిపెట్టేటటువంటి గాలిదుమారమును లేవగొట్టాలి ఫలిత పర్యవసానములు ఎట్లా పరిణమించినప్పటికీ మనము లెక్కచేయకుండా కాంగ్రెసు సిద్ధాంతములకు కాంగ్రెసు తీర్మానములకు ప్రతికూలురైనటువంటి వారందరి మీదను భావసంఘర్షణ సమ... [illegible]

...ర్థులుగా నిలబెట్టవలెను. కాంగ్రెసు అభ్యర్థుల విషయములో యితర సందర్భము లేమీ లక్ష్యం చేయకూడదు. కాంగ్రెస్‌లో చేరియుండనట్టివారైనా సరే అట్టి యోగ్యతార్హతలు కలవారిని మనము కాంగ్రెసు అభ్యర్థులుగా ప్రతిష్ఠించాలి. అటువంటి సమర్థులు దివ్యమైనటువంటివారు చాలామంది కాంగ్రెసు వెలుపల ఉన్నారు.

## కొద్ది రోజులలోనే కొత్త కార్యవర్గం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 9: నెహ్రూ నేడు ఎ. ఐ. సి. సి. సమావేశానంతరం పత్రికావిలేఖరుల గోష్ఠిలో నూతన కార్యవర్గ సభ్యుల పేర్లను కొద్దిరోజులలోనే ప్రకటిస్తానని చెప్పారు. కొత్తకార్యవర్గం [illegible]

# రాయదుర్గంలో దొంగ సారా బట్టీలు

రాయదుర్గం, సెప్టెంబరు 7: మారెమ్మజాత్ర సందర్భమున స్థానిక మద్య నిషేధశాఖోద్యోగి శ్రీ. రామదాసుగారు కనేకల్ మద్యనిషేధ సబ్-ఇన్‌స్పెక్టరు క్రిష్ణమూర్తిగారితో రాయదుర్గం హుచ్చప్పకొండ నెత్తి వేట గాలించి 65 గాలెన్ల ఊట, 24 గ్యాలన్ల బట్టీ సారాయి స్వాధీన పరచుకొన్నారు. అనుమానంపైన 6 గురిని అరెస్టు చేశారు. (స్వ. వి)

## రాబందుకూ, విమానానికీ పోరాటం

### విమానం ఓటమి

సికిందరాబాదు, సెప్టెంబరు 8: హైదరాబాదు విమానక్లబ్బుకు చెందిన ఒకవిమానం నేడు అకస్మాత్తుగా తనమీద కురికిన ఒక రాబందుతో సంఘర్షణపడి, చాలా దెబ్బతిని, దాని ధాటికి మరి తట్టుకోలేక బీగంపేట విమానాశ్రయంలో బలవంతాన దిగిపోయింది. వైమానికునికి కూడా బలమైన గాయాలు తగిలాయట.

అదే క్లబ్బుకు చెందిన ఇంకొక విమానంకూడా ఇవాళ మునీరాబాదు ప్రాంతాల్లో బలవంతాన కిందికి దిగిపోవలసి వచ్చింది. పరాకున ఆ వైమానికుడు దారి తప్పిపోయి, విమానాశ్రయం జాడ తెలుసుకోలేక పోయాడట. ఆ విమానం మద్రాసునుంచి వస్తున్నది.

## రాష్ట్రప్రభుత్వాల కొత్తఅప్పులు

బొంబాయి, సెప్టెంబరు 8: 5 రాష్ట్రప్రభుత్వాలు త్వరలోనే ప్రజల వద్ద మొత్తం 11 కోట్ల రూపాయల దాకా ఋణం చేయదలచాయని తెలుస్తున్నది.

బెంగాలు 2 కోట్లు, బొంబాయి, మద్రాసు ప్రభుత్వాలు చెరో మూడు కోట్లు, మధ్యప్రదేశ్ 2 కోట్లు, ఉత్తర ప్రదేశ్ 1 కోటి అప్పుచేస్తాయి.

# కొరియా యుద్ధం

టోకియో, సెప్టెంబరు 9: కొరియాలో ఈవేళ అసలు యుద్ధం కొంత తగ్గిందిగాని కమ్యూనిస్టు రేడియో వాగ్యుద్ధం మాత్రం నిర్విరామంగా సాగిపోతున్నది. కేసాంగ్‌లో కాక ఇంకో చోట ఎక్కడైనా యుద్ధవిరమణ రాయబారాలు మళ్ళీ ప్రారంభించాలని ఐక్యరాజ్య ప్రతినిధులు ప్రతిపాదనచేసి ఇప్పటికి 70 గం॥ పైగా అయినా, కమ్యూనిస్టుల వద్దనుంచి దానికి ఇంతవరకు ప్రత్యుత్తరం లేదు. సెప్టెంబరు 6 తేదీనుంచి ఇంతవరకు 23 మిత్రరాజ్య విమానాలు తటస్థ ప్రాంతాన్ని ఉల్లంఘించాయనీ, సెప్టెంబరు 1 తేదీనుంచి జరిగిన ఉల్లంఘనలను లెక్కవేస్తే 100 దాకా తేలుతాయనీ, పెకింగు రేడియో ప్రకటించింది.

పశ్చిమరంగంలో కొరాంగ్పొరాకి ఉశాన్యంగా కమ్యూనిస్టులు శతఘ్నులు ప్రయోగించారు.

# అనకాపల్లి అవఖండాల ముంపు

### ప్రభుత్వోద్యోగుల పరిశీలన

అనకాపల్లి, సెప్టెంబరు 6: ఈ ఉదయం జిల్లా అసిస్టెంటు కలెక్టరుగారు, తాసిల్దారు ఎస్టేటు తహసీల్దారు, ఆహారోత్పత్తి సూపర్వైజర్ గార్లతో కలసి, శెరువు లోతట్టున శెరువు వంక, అవఖండాలకు ముంపువల్ల కలిగిన నష్టాలను పరిశీలించారు. ముంపునీరు పోకుండా అటంకమైవున్న తోటాడకట్టు అక్కడ నీటి పారుదల కాలువలు, మొదలైనవాటన్నిటినీ చూచారు. కట్టుయొక్క కానాలు మూసియుంచిన గురతిలుపులు పూర్తిగా యెత్తించివేశారు. వరద ప్రమాదములు సంభవించినప్పుడు వెంట వెంటనే నీరుపోవడానికి వీలులేని పరిస్థితిని గమనించారు. (స్వ. వి.)

## శ్రీకాకుళం జిల్లాలో ఆహారనేరాలు

శ్రీకాకుళం, సెప్టెంబరు 5: ఈ జిల్లాలో ఈ సంవత్సరం ఏప్రిలు 1 వ తేదీనుండి ఆహార ధాన్యాలను విశాఖపట్నం జిల్లాకు దొంగరవాణా చేసిన 52 కేసులలో 162 మంది వద్ద 4298½ మణుగుల ధాన్యం పట్టుబడినాయి. కంట్రోల్ ధర అతిక్రమించిన 39 కేసులలో 41 రి వద్ద 618 మణుగులు; ధాన్యం దొంగనిలువల 37 కేసులలో 4844 మణుగుల ధాన్యమున్నూ పట్టుబడినాయి. ఈ జిల్లాలో లెవీపద్ధతిని 1215 టన్నులు, ఐచ్ఛికంగా 365 టన్నులు ధాన్యం 10 టన్నులు యితర ఆహారధాన్యములు సేకరించారు.

జిల్లాలో యింతవరకు 308 చౌకధరల బియ్యం డిపోలు స్థాపించారు.

## బేతపూడిలో హరిజన కాలనీ

మంగళగిరి, సెప్టెంబరు 1: ఈ సమీపమున గల బేతపూడి గ్రామము వద్ద ప్రభుత్వము వారు 100 యిండ్లు నూతనముగా నిర్మించి ఒక కాలనీ యేర్పాటు చేయుటకు ఒక స్కీము మంజూరు చేశారు. ప్రస్తుతం 20 యిండ్లు కట్టుటకు వీలైనస్థలం చూచుటకు జిల్లాకలెక్టరు పి. పి. ఐ. వైద్యనాథన్ ఐ. సి. యస్. గారు శ్రీ. కృష్ణమాచారి, ఆర్. డి. ఓ. స్థానిక డిప్యూటి తహశీల్దారు శ్రీ వి. వి. రాఘవయ్య బి. ఏ., గార్లతో బేతపూడి వెళ్ళివచ్చారు. 20 యిండ్లకు 40 వేల రూ.ల వ్యయం కావచ్చునని అంచనా వేయబడింది. ఇందులో ప్రభుత్వంవారు యింటికి రు 1500 లు ఉచితముగా యిచ్చెదరని, యింటిలో వుండువారు రు 500/-లు చెల్లించవలెనని తెలుస్తున్నది.

# క్రీడా రంగం

### ఐ. ఎఫ్. ఎ. షీల్డు ఫుట్‌బాల్

కలకత్తా, సెప్టెంబరు 8: ఐ. ఎఫ్. ఎ. షీల్డు ఫుట్‌బాల్ టూర్నమెంటు సెమీ ఫైనల్సునందు నేడు తూర్పు బెంగాలుజట్టు, రాజస్థాన్ జట్టును 3 గోలులుచేసి ఓడించింది. ఇప్పుడు తూర్పు బెంగాలుజట్టుకు మోహన్ బగాన్ జట్టుకు మంగళవారం నాడు ఫైనలుఆట జరుగుతుంది. గత రెండు సంవత్సరములలోను యీ టూర్నమెంటులో తూర్పు బెంగాలుజట్టు, గెలుపొందుతూ యున్నది.

### బొంబాయి టేబుల్ టెన్నిస్

బొంబాయి, సెప్టెంబరు 8: ఇండియా క్రికెటుక్లబ్బు టేబుల్ టెన్నిస్ టూర్నమెంటునందు నేటి సాయంకాలం స్త్రీలు సింగిల్సు ఫైనలునందు ఇండియా చాంపియన్ మిస్ సయీద్ సుల్తానా, మిసెస్ గూర్ నాశిక్ వాలాను ఓడించెను. స్కోరు 21-16, 16-21, 21-18, 13-21, 21-11. స్త్రీలు డబుల్సు ఫైనలునందు మిస్ సయీద్ సుల్తానా మిసెస్ వి. రాజగోపాలన్ లు మిస్. ఆర్. సతారావాలా, మిస్. ఎం. దస్తూర్ లను ఓడించారు. స్కోరు 21-11, 21-16 పురుషుల సింగిల్సు సెమీ ఫైనల్సునందు కె. జయంత్, యతీన్ వ్యాస్ ను 20-22, 21-12, 17-21, 21-16, 21-13 స్కోరుతోను, టి. తిరువెంగడం, యు. ఎం. చంద్రనాను 21-14, 21-17, 21-11 స్కోరుతోను ఓడించారు. పురుషులు డబుల్సు సెమీ ఫైనల్సునందు కె. జయంత్, టి. తిరువెంగడంలు ఎస్. ఎన్. గాంధి, బి. ఆర్. శాలిగ్రాలను 23-21, 18-21, 21-15, 17-21, 21-12 స్కోరుతోను, యు. ఎం. చంద్రానా, డి. పి. సోమయ్యలు డి. పి. సంపత్, ఎస్. ఎల్. ప్రాఫ్‌లను 22-20, 21-16, 16-21, 21-11 స్కోరుతోను ఓడించారు. సి. సి. ఐ. ప్లేటు ఫైనలునందు ఎన్. డి. మున్షీ, ఎం.ఐ. పార్కర్‌ను ఓడించారు. జూనియర్ డబుల్సు ఫైనలునందు ఎం. ఎల్. లుల్లా, ఎస్. ఎన్. బజాజ్ లు ఎస్. వి. మర్చెంట్, వి. డి. పార్కర్ లను ఓడించారు.

### మద్రాసు టెన్నిస్ లీగ్

మద్రాసు, సెప్టెంబరు 9: నిన్న మద్రాసు టెన్నిస్ లీగ్‌లో రిపబ్లిక్ క్లబ్బునకు, మద్రాసు జింఖానా క్లబ్బునకు జరిగిన మూడు ఆటలలోను రిపబ్లిక్ క్లబ్ రెండు ఆటలను గెలుపొందింది.

* * *

ఎవర్ మెర్రీ హాకీ టూర్నమెంటునందు శనివారం సాయంకాలం మద్రాసు యునైటెడ్ క్లబ్బు జట్టు, చెంగల్పట్టు రిజర్వు పోలీసుజట్టును రెండు గోలులుచేసి ఓడించి సెమీఫైనల్సుకు వచ్చింది.





Edited, Printed & Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, 7, Thambu Chetty St, Madras.